శ్రీరస్తు.

శ్రీపరమాత్మనేనమః.

# అగ్నిక్రీడ.

నందిరాజు చలపతిరావు

ప్రణీతము.



1925.



[8 అణాలు.

శ్రీ ర స్తు.

# ఉపోద్ఘాతము



బాణసంచు; బాణసంచ, అనుపేరి విద్య యగ్నిక్రియ, యనికొన్ని సంస్కృత గ్రంథములయందుఁ జెప్పఁబడి యున్నది.

ఈ తంతునకు ప్రధానమయినది అగ్నిచూర్ణము. అయ్యది చీనాదేశమునందుకంటె మనదేశమందే ముందుగా నాడుకలో నున్నటు వేదమందు కానవచ్చుచున్నది. కాని యగ్నిచూర్ణమిప్పటివలె యుద్ధప్రక్రియలయందు మారణయంత్రముగా నుపయోగింపఁబడినట్టు కానరాదు.

భారత యుద్ధములయందు వ్యూహములు పన్నుట, అస్త్రశస్త్ర ప్రయోగోపసంహార ప్రక్రియలు విరివిగా కానంబడుచున్నవి. బ్రహ్మాస్త్రాది సమంత్రక సాధనముల మాదిర నీ యగ్నిచూర్ణ ప్రక్రియ ప్రధానముగా నెంచబడియుండలేదేమో? అదిగాక ఆనాటి యుద్ధములలో నాయకులఁబట్టుట, చంపుటయే ప్రధానముగా నెంచినట్టు విస్తారజనమరణము నుద్దేశింపఁబడినట్టు కానుపించదు. ఈ విషయ మింకను విచారింపబడవలసి యున్నది.

ఏది యెట్లైనను, బొగ్గు, సూరేకారము, గంధకముల చూర్ణములను, వానిసమ్మేళనపు క్రియలను మనవారెఱుఁగరనుట యుక్తి యుక్తముగాదు. ఈ వస్తువుల కాల్చి బూడిద చేసియు ఔషధాస్థితముగాను మఱియు ననేకవిధముల నాయుర్వేదమందు వాడియున్నారు.

అయితే, ఆర్యులేపని చేసినన్ముఖ్యవినోదము ప్రధానముగా

నెంచక, పరమార్థమునే ప్రధానముగా నెంచు చుంటుటచేత కేవల వినోద పర్యవసాయియైన విద్యలు లేకపోలేదుగాని, అవి విస్తృతిగాంచలేదు.

ఈ యగ్నిక్రియగూడ నట్లే యభివృద్ధి గాంచినట్లుగాను పించదు.

దీపావళి దినమున దైవప్రీత్యర్థమై దీపములను బెట్టుట మాత్రము జఱుగుచున్నది. ఇటీవల బాణసంచ యనుపేర్న, పెండ్లి యూరేగింపులలో, దీపావళులలో, తోటాలు, చిచ్చుబుడ్లు, తారాచువ్వలు, పూవుపత్తులు, కాకరపువ్వువత్తులు, టపాకాయలు, మహతాబులు, హావయిలను [అకాశబాణములు] మున్నగునవి వాడుకలోనికివచ్చినవి.

బాణసంచ చేయువారిని బాణాకారీలని యొక పేరు వాడుకలోనికి వచ్చినది.

ఈ యగ్నిక్రియా విద్య మన దేశముందుకంటె పశ్చిమ ఖండమందభివృద్ధి గాంచినది.

అందలి యుద్గ్రంధములనుండి కొన్ని సంగతులను వ్రాయుచున్నాడను. ఆభాషలో గూడ నీవిషయమును గూర్చి చెప్పగ్రంధములు సకృత్తుగా నున్నవి.

1830 వ సంవత్సరమున ప్రచురింపబడిన Brewester's Cyclopedia గ్రంధసర్వస్వమున నీవిషయమై కొంతసంగతి కలదుగాని, బాణసంచకు వన్నెదెచ్చు రంగులనుగూర్చి యేమియు చెప్పఁబడనందున నందు తెలిసికొదగిన విషయముల విస్తారముగా లేవు.

తరువాత ముఖ్యముగా విచారించదగినది 1770 వత్సు॥

Captain Jones కెప్టెనుజోన్సు వలన ప్రకటింపబడిన గ్రంథము. తరువాతి గ్రంథములనేకములు దాని యనువాదముగా గానుపించుచున్నవి. అందులోని ప్రక్రియ లాచరణీయములు గావు. అది యీవిద్యలో పరిశ్రమను గలవానిచేత వ్రాయబడి నందున విస్తృతి గాంచకుండుటయే లోకహితముగదా ?

తరువాత గ్రంథములలో "Practices" అనునది చాల వరకును సహాయకారి గాని సుబోధముగా నుండదు.

చర్టియర్ Chertier అనునతడే చిత్రవిచిత్ర వర్ణములు గల బాణసంచు జేయుటను నేర్పినవారిలో ప్రథముడు. అతడు పారిస్సు దేశములో ఆర్టిలరీ ఆఫీసరుగా నుండి యీ విద్యలోఁ కృషిచేసెను. అతడు 1753 వ వత్సరమున "Nouvelles Reacherches" అను గ్రంథమును ప్రకటించెను. అందులో అగ్నిచూర్ణము (తుపాకిమందును, గూర్చి యేమియులేదుగాని చిత్రవిచిత్రవర్ణ సమాకీర్ణమగు నగ్నిక్రీడలు సంపూర్ణముగా వర్ణింపఁబడియున్నవి.

తరువాత మెలిటరీ అగ్నిక్రీడను గూర్చికొన్ని గ్రంథములు ప్రచురింపఁబడినవిగాని అవి సులభ లభ్యములుగావు ఆగ్రంథములలో ఆకాశ బాణములు [తారాజువ్వలు] ఫిరంగి గుండ్లను గూర్చి వివరిగా చర్చింపబడియున్నది.

ఇంకను రసాయనిక శాస్త్రము అభివృద్ధి గాంచవలసి యున్నది. సృష్టియందలి యన్ని వస్తువులయందు కాన్పించు వర్ణములు, బాణసంచయందు జూపించు నేర్పు ముందు ముందు రసాయనిక శాస్త్రాభివృద్ధిని బట్టి యేర్పడగలదు.

మామిడిచెట్లు లేదూలు, మునురాను జూపి, పూత

జూపి, పిందెజూపి, కాయ పండుజూపి, యంతలో చెట్టుయెండు జూపి కాలిపోవుట గూడ జూపగలిగినదే వాస్తవముగ (అగ్ని క్రీడ, అట్టి స్థితికాస్త్ర పరిశోధనలవలన కలుగగలదని తోచు చున్నది. కాని యిది సామాన్యమగు పనిగాదు. బాణసంచలో ముఖ్యమైన విషయ మేమనగా ఏదికాల్చునప్పుడును చేయికాల గూడదు. పెట్లగూడదు, చిట్లగూడదు. చేత బుచ్చుకొని కాల్చు నను, చేతిలోని గొట్టము చల్లగానే యుండవలెను. అట్లుచేయు టయే యీ విద్య యందలి నేర్పరితనమునకు లక్షణము.

వస్తువులలో గొన్నిగాలి చూపినంత మాత్రముననే భగ్గున మండునవి గలవు. అట్టివానితో పని ప్రమాదకరము. అట్టివానినిందు విడిచిపెట్టడమయినది.

కొన్ని వస్తువులు కలుపగానే భగ్గున మండును. అట్టివి రగులకుండ చేయు పద్ధతు లిందుదాహరింపబడి యున్నవి.

గాలి బుట్టలు చేయుటను గూర్చి యిందు చెప్పబడినది.

నక్షత్రములు, నక్షత్రమండలము, నీటిలోని వివిధవర్ణ యుతమైన పూవులు కాయలను గూర్చి యిందు కొంత వ్రాయ బడియున్నది.

ఇవిగాక మన దేశవాళీ బాణాకారులు చేయు బాణ సంచ ప్రక్రియలు గూడ నిందు చెప్పబడి యున్నది.

పది యేండ్ల క్రిందట ఇండస్ట్రీ పత్రికలో క్లుప్తముగా ప్రారంభింపబడిన యీ గ్రంథము నాటి నుండియు సంపూర్తి చేయుటకు ప్రయత్నించియు నన కాంతరాయముల వలన పూర్తి చేయలేకపోతిని గాని, ప్రజలు, ప్రజలలో చదువరులు చదువరులలో గ్రంథముల యందభిమానము గలవారు దీపావళి

పండుగకు ముందు ప్రతియేట 'బాణసంచ', పంపుడని హెచ్చరించు చుండుటయు, యీయేడు కొందఱు కొన్ని విలువగల గ్రంథములకు వ్రాయుచు బాణసంచ గ్రంథమునుగూడ కలిపి పంపిననే యీగ్రంథములను పంపుడనియువ్రాసి, నాకుచురుకుదనము గలిగించి, నాచేతనే యీగ్రంథరచన చేయించి నందులకు నాకృతజ్ఞతా వందనములు.

ఈ విషయమై, బొమ్మలతో మరియొక ముద్రణము వేయవలసియున్నది. మఱికొందఱు బుద్ధిమంతులు గూడ నీవిషయమై యుద్గ్రంథములు వ్రాయవలసి యున్నది.

ఈ రెండు కాంక్షలు దీరినప్పుడు గాని యిది సమగ్రకళగా నేర్పబడజాలదు.

ఈగ్రంథమును వ్రాయుటలో నాకుముఖ్యాధారమైనవి. Dr. Noad' డాక్టరు నోడు రసాయనిక పరిశోధనముమె. కామనుకెంటిషు వ్రాసిన గ్రంథమును, మఱికొన్ని ఇంగ్లీషు Encyclopedia ఎన్సైక్లోపిడియా గ్రంథములను, వారికందఱికి నాకృతజ్ఞతా సూచక వందనములు.

చదువరుల యుపయోగార్థమై 1914 సం॥న గవర్నమెంటు వారిచే ప్రచురింపబడిన The Indian explo:ives Rules మందుసామాను గురించిన విధులలో ముఖ్యమైనవిగూడ నిందు నుదహరించబడమైనది,

బాణసంచా వ్యాపారము చేయదలచినవారెల్లరు గవర్నమెంటువారి1914 పై శాసనమును విధులనుతప్పక చదివిఆప్రకారము నడుచుకొనవలసియుండునని హెచ్చరించుచున్నాను.

ఏలూరు, 22—8—22

సజ్జనసేవకుడు,
నందిరాజు చలపతిరావు.

# రెండవ కూర్పు.

ప్రథమకూర్పు ప్రతులన్నియు నచిరకాలమున వ్యయ మగుటవలన నీ అగ్నిక్రీడ యందాంధ్రులకు గల అభిమానము వెల్లడియైనది. ఆంధ్రమహాశయులకు గృతజ్ఞతాసూచకవందనము లర్పించి నీరెండవ కూర్పును ముద్రించుచున్నాను,

ఏలూరు
1—5—25

ఇట్లు,
సజ్జన విధేయుడు,
నందిరాజు చలపతిరావు.



శ్రీ పరమాత్మనే నమః

# బాణసంచా

## 1 వ ప్రకరణము.



బాణసంచలో తెలిసికొనదగిన ముఖ్యవిషయములు.

1 ఇందులో కలుపబడు వస్తువులు తెలివితక్కువగా హెచ్చు తగ్గులుగా కలిపినయెడల ప్రమాదము సంభవించును. గాన తూనికె ప్రకారము కలుపుచుండవలయును.

2 ఏయేవస్తువు లెట్లెట్లు కలుపవలయునని చెప్పిన నా యావస్తువు లాప్రకారముగానే కలుపవలయును.

3 ఎక్కువగా బాణసంచ చేయువారు మేము చెప్పిన ప్రమాణములు సరిగానున్నవో లేవో చూచుకొనిన పిమ్మట విరివిగా చేయవలయును, ఎందువల్లననగా వస్తువులు క్రమమైనవి గాకుండుటచేత, తయారు చేయువిధములో లోపముండుటచేత, వస్తువుల గుణమందును వ్యత్యాసము కలుగవచ్చును. కాబట్టి ఒక్క మతాబునకు తగినంతమందు తూచుకొని, ఆమందునకేయేవి యేయేపాళ్ళచొప్పున కలుపవలయునని చెప్పబడియున్నదో ఆప్రకారము కలుపుకొని చేసి చూచుకొని అవి చక్కగాపనిచేయనియెడల వస్తువులలో కొంచెము వ్యత్యస్త

గాము పాళ్ళువేసి చూచుకొని, ఆపాళ్ళు వ్రాసియుంచుకొని ఆప్ర కారము చేయుచుండవలయును.

4. మందు సామ్మగ్రి కొనియుండకుండ కలుపకముందే ప్రత్యే కము గా గ్లాసు బుడ్డిలో వేసి కార్కు బిగించి సీలువేసియుంచుకొని ఆబుడ్లమీద పేర్లువ్రాసి జాగ్రత్తగా నుంచుకోవలెను.

5. బాణసంచ చేయువారెప్పుడును దీపము పెట్టిన తరు వాత చేయరాదు. సిగరెట్లు, చుట్టలు బీడీలు, కాల్చుఅలవాటు గలవారు నిప్పుపెట్టె దూరముగా పెట్టి యీపనిని చేయవల యును గాని, ఏమాత్ర మేమరిపాటుగా నుండినను, బ్రతికియుం డిన యావజ్జీవము, మరణించిన కుటుంబము నకు దుఃఖముకలి గించునంతటి విపత్తులు సంభవించును గాన మిక్కిలి జాగరూక తతో యీపని చేయవలెను

6. టపాకాయలు, తుపాకీమందు, మున్నగువి యెవ్వడు జేబులో వేసికొనరాదు.

7. బాణసంచ సామాను చేతులలో పెట్టుకొని తిరు గుట మిక్కిలి ప్రమాదకరము, అవి సరిగా కూరనిమొదల రాపిడి వలననే భగ్గున మండును.

8. టపసులు, తోటాలు. మొదలగునవి పట్టి చేతులతో కాల్చుట ప్రమాదకరము, తోలుచేతులు తొట్టించు కొని కాల్చుట మేలు

మందు చేయునప్పుడు తెలిసికొనవలసిన ముఖ్యవిషయములు.

1. కొన్నివస్తువులు నిప్పుసెగతో నావిరిగా చేసి, మరల వానిని చల్లారనిచ్చుటచేత సరియైన స్థితికి వచ్చును. ఈ క్రింద వస్తువులు గంధకము పలుకులు, నీలాతోరినివి, గంధకము కడ్డీలు పాంబాణి, సాంబ్రాణి ఆసిడ్, పాదరసము, పాషాణము, హరిత

కర్పూరము, నవాసారము, దీపపు మసి, చమురుల మసి, గుగ్గిలము.

2. నీట వడియగట్టుట—కొన్ని ద్రవపదార్థములు వాము నీరు చేయునట్లు, వేడికి మరగకాచి ఆయావిరిని మరల చన్నీళ్ళచే తడుపబడుచుండు బుడ్డియందు పెట్టుటచేత సరియైన స్థితికి వచ్చును.

3. ఆల్కహాలు, బ్రాంది, విస్కీ, రమ్ సారాయి, వైను స్పిరిటు, జిన్, బెల్లపు ద్రవము, నాప్తా, బెంజైన్ మొదలగు నవియు జిగురులు, చెట్లనుండి ప్రవించు బంక, తుమ్మజిగురు ఈ జిగురులునీటిలో కలిసిపోవును. గుగ్గిలమువంటివి ఆల్కహాలు [సారాయి]లో కరుగును.

లక్క, ఇంగువ, సాంబ్రాణివంటి బంక (గాల్బానమ్) ఇవి ఆల్కహాలులో కరుగును. లక్కకడ్డీలు ఆల్కహాలులో గూడ సంపూర్తిగా కరిగి పోవు. లక్కలో జిగురుగాక, ద్రవపదార్థము. గూడ నుండుటచేత సంపూర్తిగా కరుగుటకు వీలులేదు. అట్టియెడల, సారాయిని కాగబెట్టి లక్క వేసినయెడల కరగిపోవును

జిగురులు అని అమ్మబడు పదార్థములలో చాలా భాగము చెట్లనుండికారు బంకలు, అవియు కల్తీగా నమ్మబడు చుండును.

4. కర్పూరతైలము. ఒకజాతి చెట్లనుంచివచ్చును, దీనిని కాచి ఆవిరిచల్లార్చిన యెడల కర్పూరతైలము వచ్చును. అట్లు చేయగా మిగిలినది కర్పూరపు చెట్టు జిగురువలె నుండు. ఈ జిగురు వానసంచలో వాడి చూచిరిగాని యేమియు లాభము గలుగలేదు.

ఈ జిగురుముద్దను ఆల్కహాలు సారా లో వేసి కరి

గించి కాకరపువ్వు వత్తులు మున్నగువాని మందు కలిపినప్పుడు మందును గట్టిగా నుంచునుగాని అందువలన కాలుపు తెలుపుగాను పొగయెక్కువగాను వచ్చుచున్నదిగాని దీనిని రంగు వచ్చుటకై వాడదలచుకొన్న పక్షమున దీనితో హారతి కర్పూరమును కలిపి, కరిగించి వాడవలెను.

5 బాణసంచ చేయునప్పుడందలి మందులోగాలిదుమ్ము యిసుక రేణువులు పడకుండునట్లు చూడవలెను. ఉపేక్షచేసిన యెడల వీటి కలియికవలన మంటపుట్టవచ్చును.

6 హావయిలు, పేకలు, మతాబులకు అడుగున మట్టిపెట్టి దట్టించుటకంటె ప్లాస్టరు ఆఫ్ పారిను అను తెల్లనున్నవు జిగురు మట్టిని వేయుట, మంచిది. ఒకవేళ మట్టినే వేయదలసినయెడల రేవడిమట్టిని దెచ్చి విసిరి రాయిచేసి, వస్త్రగాలితము చేసి యుంచుకొని నీటితో కలిపి వాడవలయును.

7 బాణసంచ మందులో ఇనుపరజ మెక్కువగా పడగా దానిని తీయవలయునని తలంచినయెడల, ఇనుమునుబట్టు సూది కంటిరాతినిగాని మాగ్నెట్టునుగాని దానిపై బోర్లించిన, నా యినుము నది పట్టుకొని వచ్చును.

8 గంధమును కడుగునప్పుడు కొయ్యగరిటెను వాడవలెను. వెండిగరిటె వాడినయెడల నల్లబడిపోవును. గంధకము వెండినాణెములకు తగిలిన కగ్గును. అట్టియెడ ఉప్పుగాని సీమసున్నముతోగాని వానిని కడుగ వలెను.

9 కాకరపూవత్తులు, మతాబులు చేయునపుడు వానిలోని మందు మిక్కిలి తడిగా నుంచరాదు, తడియని ఆరబెట్టితిమా ఎండినపుడు వంకర యగును, అందుకో రంగు కోసము వేసిన వస్తువుల గుణము మారిన రంగు తగ్గును.

10 మందుకూరుగొట్టము కొయ్యాదిగానుండుట శ్రేష్ఠము. ఇనుము మొదలైనవి వాడినయెడల ఇనుప కాకితములో తుప్పును తీసివేయవలయును.

11 సూరేకారము మున్నగు వస్తువులను కాచుట కుపయోగించు పెనము తుప్పుపట్టి యుండినయెడల దానిని కొబ్బరినూనెతో ముంచిన గుడ్డతో తుడిచి అర్చి పిమ్మట పొయ్యిమీద బెట్టవలెను. ఇంకను మకిలగా నుండు పక్షమున దానిలో నీళ్ళుపోసి కొంచెము సోడాముక్క వేసి కళ పెళ కాచి ఆనీళ్ళు పారబోసి, మూల్లెమూకుడు దించి ఆరబెట్టి తుడిచిన పిమ్మట వాడుకోవలెను.

1. జల్లెడ—తీగెజల్లెడ తుప్పు తుడిచి వాడవచ్చును. లేదా మజిలినుగుడ్డ జల్లెడపైనవేసి చుట్టు జారకుండ గట్టిగా కట్టి వాడుకోవలెను. సత్తుజల్లెడ ప్రశస్తము.

13 మందువత్తి, అనగా మందువేసి చుట్టిన దూదివత్తి, జాగ్రత్తగా లోపల దాచి యుంచుకోవలెను. ఎప్పుడు నజాగ్రత్తగా బైటనుంచరాదు.

మందు వత్తు తుమ్మ జిగురు నీటితో క్లోరేటు మందు [Chlorate meal) తో చేయుట ప్రశస్తము. అనగానిదితుపాకి మందువలెనేచేసి, అందులో నైట్రేట్ ఆఫ్ పొటాషునకు బదులుగా క్లోరేట్ ఆఫ్ పొటాషు వాడవలయును.

6 వంతులు (బొగ్గునుసురేకారము) కలిపిన మందును 1 వంతు గంధకమును కలుపవలెను. అసలు గంధకము లేకుండ బొగ్గునురేకారమే వత్తులకు చాలునని చెప్పబడియున్నది. కొంచెము పిండి కలుపవచ్చును.

# బాణసంచా

## ౨ వ ప్రకరణము.

బాణసంచాలోని కెల్ల ముఖ్యములైన వస్తువులు మూడు బొగ్గు, సురేకారము, గంధకము.

ఈ వస్తువులు ప్రత్యేకముగా నుండునపుడు ప్రాణము లేని వస్తువులవలెనే నుండును. ఈ మూటిని ఒక విధముగ పాళ్లుగా కలిపిన యెడల మహాద్భుతమును భయంకరమును నగు తేజస్సు పుట్టుచున్నది. ఇట్టి ప్రళయాగ్నివలన ప్రపంచమే భస్మీభూతము చేయదగినట్లు కానుపించును.

ఈ వస్తువుల యందలి యీ మహాశక్తిని గనిపెట్టినవా డెట్టిఘనుడో చెప్పరాదు. ఆ మహాశక్తికి నేడు ప్రపంచము దాస్య మొనరించుచున్నది. దైవమునకు జంకనివాడు, సైతముదాని ముందర గడగడ వణకుచున్నాడు.

ఇట్టి వస్తువులను సృజించి వీనిసమ్మేళనము వలన నొక మహాశక్తి నిగల్పించిన పరాత్పరుడెంతయు స్మరణీయుడు. ఈ వస్తువులవలన నీశక్తి యెట్లుద్భవిల్లుచున్నదో చూతము !

ఈమూడు వస్తువులకు నగ్నిప్రయోగము చేయగానే యిట్టి మహాత్తరమైన శక్తి యెట్లుకలుగును ?

ఇందలి సురేకారములో నైట్రొజను, ఆక్సిజను అను రెండువాయువులున్నవి. బొగ్గులో "కార్బను" అను నదిగలదు. నిప్పంటించగానే, ఆక్సిజను నైట్రొజనునుండి విడిపోయి, కార్బనులోగలిసి, కార్బొనికి ఆసిడుగాలిని గలిగించును. అట్లెంత

శీఘ్రముగా కార్బోనిక్ ఆసిడుగాలిని కలిగించగానే దానితీవ్ర శక్తివలన అదకుపాకిలోగల వస్తువుల నెంతదూరమైన విసిరివేయు గలశక్తిగలది యగుచున్నది. గంధకము మంటవృద్ధిచేయును. [illegible]ల్లీ మూడును బాణసంచ మందునకు ప్రధానముగా [illegible]న్నవి.

సురేకారము, బొగ్గు గంధకము నీ మూడు వస్తువులు వేడితగులగానే యొకటిపై నొకటి పనిచేయుట కారంభించును ఆపని చేయునప్పుడు విస్తారమైన వాయువు వెడల గ్రక్కును. మందుకు నిప్పురవ్వ అంటుకొనినయెడల అందలి బొగ్గు పొడి ముందుగా అంటుకొనును. తరువాత గంధకమంటుకొనును. చివరకు సురేకారము పొటాషు, నైట్రోజను ఆక్సిజను అను మూడు వస్తువులుగా మారిపోవును. అందులో కొంచెము పొటాషు కార్బనువల్ల పొటాషియము నీరు, ఆక్సిజనుగా మారును. అట్లు ఏర్పడిన ఆక్సిజను గంధకముతో కలిసి గంధకధృతి అగును. అందులో కొంత పోవును కొంతగంధకధృతి పొటాషులో కొంత భాగములో కలిసి, పొటాషియము సల్ఫైటు అగును. అదియే చిట్టెముగా నేర్పడుచున్నది. వ్యయముకాని కొంత గంధకము మిగిలిపోవుచున్నది. కొంత గంధకము పొటాషియముతో కలిసి పొటాషియము సల్ఫైడగుచున్నది. ఇందులోని కార్బను కార్బనాక్సైడు, కార్బానిక్ ఆసిడ్ గాలియగుచున్నవి. కొంత కార్బను మిగిలి దిగిపోవుచున్నది. కొంత కార్బానిక్ ఆసిడుగాను పొటాషుతో కలిసి పొటాషియము కార్బనేటుగా చిట్టెమైవచ్చుచున్నది. ఈమందులో నుప్పుపిల్లు అమితోష్ణమువలన నందలి నైట్రిక్ ఆసిడు నైట్రోజను, ఆక్సిజనుగా విడిపోయి నీటెని ఆవిరిగా మార్చుచున్నది. ఇంకను పుట్టుకమువలన, దీనిలోమిగులు పదార్థములో కొంత భాగము పొగగా మారిపోవును. ఇందులో

నల్పరేటికు హైయిడ్రోజను కార్బరేటును హైడ్రోజన్ కార్బను నల్ఫైడు, పొటాషియముసల్ఫేటు: పొటాషియము సియానైడు కలుగుచున్నవి.

బొగ్గుపొడిలో బైటితేమ నాకర్షించు గుణ ముండుట వలన, ఎంత జాగ్రత్తగా నుంచినను మందు నెమ్మెక్కొనుచుండుట స్వాభావికమైనది. ఈనెమ్మెక్కొను గుణము సురేకారమును గడ్డకట్టించి, మందుయొక్క జ్వలన గుణమున కాటంకము కలిగించుచుండును.

ఈమందువలన గలుగు నుష్ణత, బంగారము, రాగిని కరగించుటకు చాలియుండునని శాస్త్రజ్ఞులు కనిపెట్టియున్నారు.

మంచితుపాకిమందునకు లక్షణములేవియనగా:-ఒకకాకితముమీద నీమందు పరచి నిప్పు ముట్టించగానే భగ్గున మండుచుండవలెనేగాని కాకితము నల్లబడగూడదు. కాలగూడదు.

మందు చేయు స్థలమున నిప్పు, పుల్లలు, వత్తులు ద్రావకములు, కిరసనాయిలు, నాస్తా ఎంతమాత్రమును చేరనియ్యరాదు. ఇది మిక్కిలి ప్రమాదకరము.

వివిధ దేశములోగల తుపాకిమందు పాళ్ళనుగూర్చి తెలిసికొన గోరువారికి యీక్రింది పధకము మిక్కిలి సహాకారిగానుండును.

తుపాకిమందు, నలుపుదేరిన బూడిదెరంగు గలిగియుండును. లేదా జోగురువర్ణము గలిగినదైన యుండును. ఎక్కు నల్లగానున్న పక్షమున ఎక్కువబొగ్గు కలిసినట్టిగాని లేదా పాడ నబొగ్గు సరిగా కాలలేదనిగాని తలంచవలెను. మధ్యమధ్య తెల్లని తళుకు గానుపించిన పక్షమున నాతళుకు సురేకారపు వలుగని ముక్కలని యెంచవలెను. ఇట్లుండుట పరిశస్తముగాదు.

వివిధ దేశములలో చేయుబడు తుపాకి మందులో గల భేదము లీ క్రింద వివరింపబడినవి.

| దేశము. | | సురేకారము. | బొగ్గు | గంధకము. |
|---|---|---|---|---|
| ఇంగ్లాండు. | మామూలు మందు. | 75 | 12-50 | 12-50 |
| | షూటింగు పవుడరు | 78 | 12 | 10 |
| | షూటింగు పవుడరు | 76 | 15 | 9 |
| | స్ప్రైమింగు పవుడరు | 65 | 15 | 20 |
| ఫ్రాన్సు. | నేషనలు మిల్సు | 75 | 12-50 | 12-50 |
| | షూటింగుపవుడరు | 78 | 12 | 10 |
| అమెరికా. | మామూలుమందు | 75 | 12-50 | 12-50 |
| ప్రష్యా. | | 75 | 12--5 | 12—5 |
| రష్యా. | | 8-78 | 18-59 | 12-63 |
| ఆస్ట్రియా. | | 76 | 11-50 | 12-60 |
| స్పెయిను | | 76-47 | 10-78 | 12-75 |
| హాలెండు. | | 70 | 14 | 10 |
| స్వీడను. | | 75 | 9 | 16 |
| స్విజ్జరులాండు. | | 76 | 14 | 10 |
| చీనా. | | 75 | 14-40 | 9-60 |

# అగ్ని క్రీడ

## 3 వ ప్రకరణము.

### సహజ పదార్థములు.

ఇందలి వస్తువులను గూర్చి కొంత చెప్పుటచాలముఖ్యము

బొగ్గు—గనులలో దొరకు రాతిసి బొగ్గు పనికిరాదు. చమురుగల చెట్లబొగ్గుపనికిరాదు. జిల్లేడు, తుంగ, గడ్డిమసి మిక్కిలి శ్రేష్ఠము. ఇప్పుడిప్పుడు గడ్డికాల్చినబొగ్గు మిక్కిలి యెక్కువగా వాడుచున్నట్లు కానుపించుచున్నది.

జిల్లేడు, గడ్డికాడలను తెచ్చి పెద్దఇనుపకుంటలో పెట్టి అందులో సన్నని యిసుకపోసి, మంటమధ్యమున బెట్టి, అందలి కొయ్యముక్కలు కణకణమండి పొగచల్లారినదాక నుంచి, బాగానల్లబడి చెట్టుస్వభావమంతయు పోయినదనిన పిమ్మట యిసుక పారబోసి- బొగ్గుతీసి దానిని, చిన్నముక్కలుగా కొట్టి విసరవలెను. విసిరినదానిని తీసి వస్త్రగాలితము చేసి యుంచుకోవలెను. కొన్ని బాణసంచాలకు బొగ్గు బరకగా నుండవలెను. కాని చాలభాగమునకు బొగ్గు మిక్కిలి మెత్తగా నుండవలెను. బొగ్గుయెంత మెత్తగా నున్న నంత శక్తి అవిర్భ నుంచును,

బొగ్గును పొడికొట్టుటకై తోలు సంచికాకుట్టి అందులో బొగ్గుపొడివేసి కొయ్యసుత్తితో మెత్తగా నలుగునట్లంతము కొట్టుచుండవలెను. ఇందువలన బొగ్గునకు చెమ్మ యెనలగునవి తగులవు. బొగ్గులోని సత్తువ తగ్గదు.

గంధకము—పరిశుద్ధమైనది గావలయును లేకున్న

మందు నుంచిది తయారు కాదు. సాధారణముగా గంధకములో గంధక ధ్వని కలిసియుండును. అట్టి గంధకము పోటాసియము క్లోరేటుతో కలిపినప్పుడు మంటమండును. అందువలన గంధకమును శుద్ధిచేయవలెను. ఈశుద్ధి యెట్లనగా—నీళ్ళలో కార్బనేటు అఫ్ పొటాషు (Carbonate of Potash)ను వేసియుంచి, ఆనీళ్ళను గంధకము వేసిన పాత్రలో బోసి బాగా కలుపవలెను. అది బాగా నిలువయున్న పిమ్మట దానిపైన తేలిన తెట్టును తీసివేసి మరల చల్లని నీళ్లు పోయవలెను. దానిని ఒక గుడ్డలో వేసి వడియపోసి, అందలి నీరు పూర్తిగాపోవుటకై ఒకదినము కొయ్యపై పలుచగా తగిలించి యుంచవలెను. మరునాడు దయమున అందలినీరు చప్పగాపోయి అందలి కారము పులుపు పోయి శుభ్రముగా నుండును. తరువాత గంధకము ఆరెడిదాక రెండుమూడు దినములు ఆరబెట్టవలయును.

ఈపత్రికారము తయారుచేయుట కష్టమనిపించిన యెడల కడ్డీలుగానున్న గంధకము కొని సన్నగా వస్త్రగాలితము చేసి యుంచుకొనవలెను.

సురేకారము—Saltpetre దీనినే Nitrate of Potassium నైట్రేటు అఫ్ పొటాసియము మందురు. సురేకారము మనదేశములో దొరకును. దానిని శుద్ధిచేసి అమ్ముచుందురు. మంచి సురేకారము 6 పలకల ముక్కలు గానుండును దీనికి రంగులేదు. స్ఫటికమువలె నుండును. దీనిరుచి, కారముగా నుండును. గొంచెముచేదు.

బాజారు సూరేకారములో కొంచెము ఉప్పు మొదలైనవి కలిసియుండును. దీనిని వెచ్చనినీళ్లలోపోసి వేయించిన యెడల

యుండలి నీరు హరించును. తరువాత దీనినిదంచి, విసిరి వన్నని పొడి చేసియుంచవలెను. ఈ మూడును ప్రధానమైన వసువులు. ఇవిగాక మరికొన్ని వస్తువులీ బాణసంచాలోనికి కావలసియున్నవి.

రసాయనిక వస్తువులు.

1 Ammonia Muriate of Ammoniam or Sal Ammoniac. Chloride of Ammonium.

అమ్మోనియా, మూరియేటులేకసాల్ అమోనియక్. అమోనియముక్లోరైడ్.

ఇదియే నవాసారము. ఇది బాజారులలో అమ్మబడును. తెల్లగా చిదుపుటకు వీలులేని పలకలుగా నుండును. దీని పలుకులు ముక్కోణాకృతిగా నుండును.

ఇది అల్కహాలులో (సారాయి)లో కరిగిపోవును. వేడి నీళ్ళలోగూడ కరుగునుగాని అంతయు కరిగిపోదు.

ఈ నవాసారములో, అమ్మోనియము సల్ఫేటు ఉప్పు, సోడియము సల్ఫేటు, మాగ్నిషియము సల్ఫేటుకలిసియుండును. ఒకప్పుడు కొంచెము ఇనుము, సీసముగూడ స్వల్పముగా కలిసియుండును.

2 Antimony Sluphuret Regulms

ఇది పెళుసు లోహము. దీనిని అంజనము, నుర్మారాయి సౌవీరమని వాడుదురు. బాజారులలో దొరుకు సౌవీరములో పాషాణము, ఇనుము, రాగి, సీసముగూడ స్వల్పముగా కలిసియుండును.

3 Arsenic, Red Sulphuret or Realgar Yellow Sulpher or orpiment, Arsenious Acid.

ఆర్సినిక్. రెడ్ సల్ఫురెట్ లేక రీలుగార్ పాషాణము.

ఆక్సిలిక్ ఆసిడ్ బాజారులలో దొరుకునది.

ఆసిడ్. ఇది తెల్లగా, పెళుసుగానుండును దీనినిబొగ్గుతో కరిగించిన మొదల పాషాణ లోహముగును ఇది మహావిషముల లోనిది.

బాజారు పాషాణము సాధారణముగా తెల్ల యిసుక, పిండియున్నము, మొదలగు వస్తువులతో కల్తిగానుండును.

4. Asphaltum అస్ఫాల్టమ్.

ఇది జాతిమట్టినుండి బుట్టు జిగట పదార్థము. ఇది గట్టిగా పెళుసుగా నుండును. వేడికి కరుగును. ఇది బాజారు లలో దొరకును.

5 Barytes Chlorate & Nitrate బారిటస్ (క్లోరేటు,) నైట్రేటు, దీనినే Barium Sulphate బారియమ్ సల్ఫేటు లేక, heavy spar or Barite అందురు.

తెల్లగాను పసుపురంగు ముక్కలుగా దొరకును. తెల్ల నాపజాతి ముక్కలలో పసుపురంగు వానివలె యుండును. ఇది క్షారములలోనిది. కారముగా నుండును. దీనితో రసాయిన మిశ్రితములైన పదార్థములు దొరకును.

6 Burgundy Pitch బర్గండీ పిచ్.

ఇది ఫ్రాన్సుదేశములో నున్న బర్గండీయందలి అచీసు చెట్లనుండి కారు బంక. నీళ్లుపోసి వండి చేయుబడు పసుపు కాలు గల లేగుర రంగు తారు. ఇది పలాస్త్రీలు మొదలగునవి చేయుటలో కూడ చాల నుపయోగపడును.

7 Cast Iron borings.

బీడు, రజము, ముక్కలు, ఆకారాలతో కోయు వచ్చు రజము.

8 Naphtha నప్తా, తార్థునప్తా.

కూ్రిడాయిలులోనుండి కిరసనాయిలు తయారు చేయునపుడు దిగబడు మడ్డి ఇది ఖనిజము. దీనిని వార్నీషు మున్నగు వానిలో కలుపుట కుపయోగించుచున్నారు బెంజైననుగూడనీ మడ్డివంటి పదార్థమే.

9. Copper—1 Black oxide—బ్లాక్ ఆక్సైడ్.

2 Oxy Chloride కాపర్—ఆక్సిక్లోరైడ్.

3 Sulphuret కాపర్—సల్ఫరెట్ (రాగి గంధకమిశ్రము.)

Oxy Chloride of Copper ఆక్సిక్లోరైడ్ ఆఫ్ కాపరు.

దీనిని చేసికొను విధము — ఒకచట్టిలో రాగిముక్కలు వేసి, దానిపైన సగము నీళ్ళు,సగము హైడ్రోక్లోరిక్ ఆసిడుకలిపి పోయవలెను ఒక దినమూ ఏప్రకారముగా నుంచి మరునాడు తీసి నీడ నారబోయవలయును. తరువాత దాని నంటియున్న ఆకుపచ్చని దుమ్మును గీకి నీరుగల ఒక పళ్లెములోవేసి తగినంత వచ్చిన పిమ్మట ఆరబెట్టవలెను.

రాగి యిది సరిపిగా దొరకునుగాని బాజారు రాగిలో ఇనుము తగరము మొదలగు కల్తీ చాలగలదు.

10 Dextrine డెక్స్ట్రిన్.

ఇది తుమ్మజిగురునకు బదులుగా వాడబడు పదార్థము. ఇది పంచదార మున్నగువానితో తయారు చేయబడును.

11 Lacquer లక్క.

ఇది లక్క. ఆల్కహాలు (సారాయిలో) వేసి పసుపు మున్నగు రంగులువేసి చేయబడు వార్నిషు. వార్నిషునకు బదులుగా వాడుచుందురు.

12 Lamp cotton పూవత్తికుపయోగించు పత్తదూది.

14 Lead సీసము.

ఇది బరువుగానుండును. నీలివర్ణము, మెత్తగానుండును. గాని సాగి ముడుచుకొను స్థితిస్థాపక గుణము లేదు. దీనితో గుండు, గొట్టములు, చేయబడును. త్వరలో నిప్పంటుకొను గుణము గలది.

15 Lead Chloride లెడ్ క్లోరైడ్.

16 Lead protoxied, Litharge లెడ్ ప్రోటాక్సైడ్ మురుదారుసింగు.

17 Lead Dentoxide లెడ్ డెంటాక్సైడ్.

సిందూరము.

18 Lead Nitrate లెడ్ నైట్రేట్.

ఇవియన్నియు సీసవికారములు బాజారులలో నీపేర్లతో దొరకును, విస్తారము వెలగలవి గూడ కావు.

19 Magnesium filings మెగ్నీషియము రజము.

20 Mercury chloride or calomel

కాలోమెల్, రసభస్మము, పసుపు గలిపిన తెలుపు వర్ణము. ఇది సహజమైనది. దొరకును.

21 Methylated spirit మితిలేటెడు స్పిరిటు.

ఇది కొయ్యనుండి తీసిన ఆల్కహాలు సారాయి.

22 Oxalic Acid ఆసిడ్

23 Plaster of Paris ప్లాస్టరు అఫ్ పారిసు.

ఇది బజారులలో దొరకును. ఇది ఒకప్పుడు పారిస్సులోని పారిసు పట్టణమునుండి తేబడెను. కాల్షియమ్ సల్ఫేటు గంధకము సున్నము కలిసినయొకవిధమగు సుద్ద. ఇది విరివిగాదొరకును, దీనిని నీటితో తడిపియుంచిన బిగిసికొని పోవును. మట్టికంటె త్వరగా నానును. హావయిలు మున్నగువానిలో నడుగు భాగమున తట్టించుట కుపయోగకరము.

24 Pothsh Chlorate పొటాష్క్లోరేటు Potash Nitrate పొటాషు నైట్రేటు, Nitre పొటాను నైటరు, Slate petre పొటాసు సాల్టుపీటరు.

ఇవియన్నియు పొటాషు సంబంధమైన వికారములు, ఇవి షాపులలో దొరకును

పొటాషు అనునది క్షారము, రష్యా అమెరికా దేశములలో విపరీతముగా నున్న అడవులలోని చెట్లుకాల్చి బూడదచేసి ఆబూడెదలోనుండి యీక్షారములను రసాయనశాస్త్రానుగుణముగా చేయుదురు.

5 Shellac షెల్లాకు

కరిగించిన కర్ర లక్క ఇది చెట్టులక్కతో దవణ్మారను జిగురు కలిపి వండి తయారుచేయుదురు. ఇందులో నారింజ రంగు వలచని బిళ్ళలు శ్రేష్టము.

26 Soda Bi Carbonate

సోడా అని అమ్మబడునదే సోడియమ్ బై కార్బనేటు ఇది యొక ఉప్పు.

27 Stearine స్టిరైను జంతువుల కొవ్వు.

ఇది వేసిన వస్తువుల గట్టివము

28 Steel filings ఉక్కురజము,

29 Strontiam cor onate & Nitrate
స్ట్రాంటియము కార్బొనేటు & నైట్రేటు
ఇది స్కాట్లండులో దొరకు సున్నమువంటి మట్టి. ఇది క్షారములలోనిది.

30 Sugar పంచదార

31 Sulphur flowers గంధకము.

32 Tin foil తగరము.

33 Vegetable black బొగ్గుమసి.

34 Wax మైనము.

35 Zinc సత్తు

36 Flax జనుపనార.

37 Lycopodium లైకోపోడియము.
ఇది యొక విధమగు నాచు. దీనిని బాణసంచలో వాడుచుందురు. ఇది మన దేశపు చెట్టు గాదు. బెండువలె తేలికగా నుండును.

38 విదేశపు బాణసంచలో లక్క విస్తారముగా వాడబడుచున్నది. అందువలన మందు రాలిపోకుండ నెంతకాలమైనను జాగ్రత్తగా భద్రముగా నుండును. లక్క త్వరగా నిప్పంటుకొను స్వభావముగలది యగుటచేత బాణసంచలో ముఖ్యమైన వస్తువగా నున్నది.

Lac Solution లక్క ద్రావకము చేయు విధము. ఒక తగరపుగిన్నెలో అరఅవున్సు అనగా 1 1/4 తులముల వలు

చటిబిళ్ళ లక్క వేసి, 1/4 పయుంటు (పయుంటు=1/4 పా) గాని 5 ఔన్సులుగాని, మిత లేటెడుస్పిరిటుగాని, దాంకే మొదల దానికి బదులుగా కొయ్యా నాప్తా తైలముగాని పోయవలెను. ఒక దినముంచి అప్పుడప్పుడు కొయ్యతో కలుపుచుండవలెను. ఒక గిన్నెగాని చిన్న డేకిసాలోగాని నీళ్లుపోసి కళపెళ కాచి, అందులో నీలక్కగల తగరపుపాత్రి పెట్టవలెను. అప్పుడులక్క ఉడికి గడ్డకట్టును, నీళ్లు లక్కను ఉడికించునంత వేడిలేని పక్షమున, నీళ్లు కళపెళలాడు మరియొక డేకిసాలో నిది పెట్టియుంచవలెను. లేదా ఒకబూరెల మూకుడుకాచి, క్రింది నిప్పుతీసివేసి ఆవేడిదానిలోనిది పెట్టవలెను. అప్పుడులక్కకరగును. తరువాత దింపి చల్లారగానే సీసాలోపోసికార్కు మూతపెట్టియుంచవలెను. స్పిరిటుగలవస్తువు నెప్పుడును వేడి మంట మీాద పెట్టరాదు. పెట్టిన మొదల భగ్గున మండిపోవును. ఇది యింకను పలుచగా నుండవలెనన్న మరల పైప్రకారముగా వేడి నీళ్ళలో కాచవలెను లేని మొదల కరుగదు.

౩౯ Wax Solution మైనపు ద్రావకము. ఒక పాత్రిలో 1/2 అవున్సు తెల్ల (పాల) మైనమువేసి దానిలో ౯ అవున్సుల నాప్తా అను మట్టి తైలముపోసిన మైనము కరుగును, అది తీసి గ్లాసులోవేసి కార్కువేసి యుంచవలెను.

40 జిగురు. జిగురు పాత్రలోవేసి నీళ్లుపోసియుంచిన మొదల జావగా కరుగును, ఇది కాకితము లంటించుటకు పనికివచ్చును. మతాబాలందు, తారా జువ్వలుమందు మొదలగునవి కొంచెముగా బిడుపుట కైతే, ¼ అవున్సుల తుమ్మజిగురు పయుంటు నీళ్ళలో నానవేసి బాగానానిన తరువాత తీసిబుడ్డిలోపోసి యుం

చవలెను. మిక్కిలి తొందరగా కావలయునన్న నీళ్ళలో జిగురు వేసి కాచి కఱ్ఱతో కలుపుచు బాగానైన పిమ్మట తీసివడపోసి యుంచవలెను. కాని చన్నీళ్లతో చేసినదే ప్రశస్తము.

41 Dextrine Solution డెక్‌స్ట్రైను 1/2 అవున్సు తెచ్చి 6 అవున్సుల నీళ్ళలో వేసి గరిటెతో కలుపుచు, నీళ్లు చాలని యెడల మఱికొంచెము కలుపుచు బాగా కరిగిన పిమ్మట తీసి బుడ్డిలో పోసి యుంచుకోవలెను.

42 పిండి. మైదాపిండి 2 అవున్సులునీళ్ళలో వేసి, 2, 3 నిమిషములు పొయ్యిమీదబెట్టి పుల్లతో కలుపుచుండిన, మంచి పిండియగును. ఇదే కావలయునన్న తిరిగి నీళ్లుపోసి కొంచెము వడి దింపి వాడుకోవచ్చును. కొందఱందులో పటికపొడి గూడ వేయుదురు కాని ఇది క్షారమగుటచేత, పొటాసియము క్లోరేటు, గంధకము క్లోరేటు, పంచదారతో కలిపి నప్పుడు ఆసిడ్ (పులుపు)గా నగు స్వభావము కలదగుటచేత దానిని వాడకుండుటయే శ్రేష్ఠము.

43 Linseed Oil సీమ అవిసెనూనె. ఇది కల్తిలేనిది బాణసంచాలో వాడబడును.

44 Meal powder ఇది మిక్కిలి సన్నని అనగా మైదాపిండివలె మెత్తగానుండు తుపాకిమందు. ఇది బాణసంచాలో విస్తారముగా వాడబడును.

45 Grain powder తుపాకిమందు. ఇది మూడురకములుగా నుండును. మిక్కిలి మెత్తనిది హవాయిలు మొదలగు వానిలో వాడుదురు. ఇది గొట్టములో సరిగా నిముడును.

కుండ్లు చిమ్ముబుడ్లకు కొంచెము బరకగా నున్నది చాలును.

46 Oxalate of soda సోడా అక్సాలేటు 8 పౌనులు చాకలి చౌడు. దీనిని నీళ్ళలో కలిపి తుక తుక ఉడకబెట్టవలెను. మరియొక పాత్రలో నీళ్లుపోసి సలసల కాచి, అప్పుడు, పౌనుఆక్సాలిక్ అసిడ్ వేయవలెను. ఇది ఒక పెద్దపాత్రలో దిమ్మరించవలెను. ఇందులో నిదివరకు ఉడికించి యుంచిన చాకలి చౌడు గరిటెతో తీసి కొంచెము కొంచెముగా వేయవలెను. బుస్సున పొంగుచుండును. పొంగు అరిన తరువాత తీసియుంచుకోవలెను.

47 Vegetable black.

ఇది దీపము మసి. దీపపువత్తి కాలుచుటచేత కలుగు పొగ. ఇది మిక్కిలి మెత్తగానుండును.

ఇది సీమ అవిసినూనెతో కలుపరాదు. అట్లు కలిపిన యెడల భగ్గున మండును.

48 Grain powder.

క్లోరేటు పవుడరు లక్క ద్రావకముతో గాని తుమ్మ జిగురునీటితోగాని తడిచేసి, సత్తు జల్లెడగుండ పట్టిన యెడల, గ్రెయిను పవుడరగును.

49 Slow match నెమ్మదిగా కాలువత్తి

ఉప్పు అం అవున్సు సలసల కాగు నీళ్ళలో, ద్రావము Nitrata of Lead, లెడ్ నైట్రేటు వేసి అందులో బ్లాటింగు (అద్దుడు) కాకితము ముక్కలుగాని, నన్నని ఉప్పు గాని, వేసినయెడల దానిపైని సీసము పలచగా పూతి బట్టును. అట్టి కాకితపు ముక్క 4 అంగుళములైతే పావుగంట కాలును.

50. Touch paper సూరేకారము ½ పయింటు వ కుం

ము వేడినీళ్ళలో వేసి, 12 పౌనుల గాలి బుట్టలకు వాడుకొను బ్లాకాగితము, ఉమూరేకారపు నీళ్ళలో ముంచి, కోడి యీకెతో గాని బ్రష్షుతో గాని రాచి ఆరబెట్టి, వానినన్నిటిని ఆరిన తరు ంత ప్రోగుచేయవలెను.

51 Quick Match చుట్టున కాలుమందువ ్తి.

ఒక వళ్ళెములో 2 పౌనుల సన్నని మైదావంటి బొగ్గు పొడుముగాని, గ ినపొడుముగాని పోసి అందులో వేడి మైదా గంజి పోసి, అది బాగా జావగానైనపిమ్మట, నూలువత్తి ఇందు లో తడిపి ఆరబెట్టవలెను. లేదా యీనూలుపోగులు ఒకరెండు పందిరిగుంజలకు కట్టి, దానిపైన నీమందుజావ బాగానూలున కంతకు పట్టునట్టుపూయవలెను. బొగ్గుపొడిదీనిమీద చల్లవలెను.

బాణసంచలో రంగు లెట్టుకలుగును ?

బాణసంచలోనికి కెల్లప్రధానమైనది రంగులు. జపాను జర్మనీ దేశములలో తయారు చేయబడు బాణసంచను గూర్చి ఈగ్రంధములోనే వ్రాయ దలంచితిని గాని గ్రంధవిస్తరభీతిని మరియొక భాగముగా రచించుటకుంచితిని.

1 ఇనుప (బీడు) ముక్కలు, రజము వేయుట వలన ఎఱుపు రంగు, తెలుపు ప్రకాశమానముగా నుండును.

2 ఉక్కులో కార్బనుండుట చేత నాదుంట ముక్కలి ప్రకాశమానమై యుండును. జ్వాల వంకరగానుండును.

ఆకుపచ్చ

రాగిముక్కలువేసిన పక్షమున ఆకుపచ్చరంగువచ్చును.

నీలిరంగు.

పత్తురజము వేసినయెడల నీలిరంగు గలుగును. నీలిరంగు

అంటిమొని సల్ఫరెట్టు వాడిన పక్షమున సత్తుకంటె పాలిపోయిన నీలిరంగు వచ్చునుగాని పొగ యెక్కువగా నుండును.

బొగ్గు తెచ్చి పండగాచేసి దానిమీద రాగి రజను వానిని నిప్పుమీదఅనగా కొలిమిలోబెట్టి ఊదవలెను. అప్పుడు మెట్టుగా కాలును. ఇంకకొంత రాగిరజముగాని, ఆకురాయితో గోకిన రాగిపొట్టుగాని దానిమీదవేయవలెను. దానిపైన (కాలోమెలు) రసభస్మముగాని నవాసాగరముగానివేసి, కొలిమి యూదవలెను. ఇప్పుడు రమ్యమైన నీలిరంగు వచ్చును. రాగి తుత్థము వేసిన నిట్టి నిలిరంగే వచ్చును రసభస్మమునుండి వచ్చుక్లోరెడ్ పొగగాని, అమోనియానుండి బయలువెడలు క్లోరెనుపొగగాని రాగికలిసినయేవస్తువతోవేసి కొలిమిలోయూదినను వచ్చును.

పసుపురంగు.

అంబరు, రోజను, ఉప్పువేసిన పక్షమున పసపురంగు వచ్చును.

దొండపండువంటి ఎఱుపురంగు.

దీపపుమసి, తుపాకిమందు కలిపిన పక్షమున ఎట్టిని ఎరుపురంగు వచ్చును.

గులాబి

పై పాళ్ళలో నైటరు కొంచె మెక్కువగా వేసిన యెడల గులాబిరంగు వచ్చును.

లేత ఆకుపచ్చరంగు

కాపరునల్ ఫరెట్టు, సాల్ అమోనిక్ వాడిన యెడల లేత ఆకువంటి పచ్చరంగు పట్టును.

తెలుపు.

హారతికర్పూరము వేసినయెడల స్వచ్ఛమైన తెలుపు రంగు కలుగును.

రంగులకై Chlorate of Potash powder పొటాసుక్లోరేటుపొడి వాడునప్పుడు, అందులో నైటరు సూరేకారము కలుపనిదిగా జూడవలెను. సూరేకారము రంగును తెలుపుగా మార్చును. పొటాసు క్లోరేటు, బొగ్గుపొడి, గంధకము ప్రత్యేకముగా వాడునప్పుడు రంగులు కాంతివంతముగా నుండును. రసభస్మము (కాలోమెల్) రంగును దట్టపరచును. మంటను తగ్గించును.

గులాబి లేతఎఱుపు.

Lycopodium లైకో పిడియము వేసినపక్షమున గులాబి లేతఎఱుపురంగు వచ్చును.

# దేశవాళీ బాణసంచ.

## 4 ప్రకరణము.

దేశవాళీ పద్ధతి ముందుగాచెప్పి తరువాత రసాయనిక విదేశపు బాణసంచనుగూర్చి చెప్పెదము.

1. తెల్ల మతాబులు:—24 భాగములు సూరేకారము, 7 భాగములు గంధకపు పొడి, (ఇదిబజారులో పిండిగానే అమ్మునది కొనవలెను.) ౭ భాగములు మణిశిల గంధకము కలుపవలెను. సూరేకారము గంధకముతో కలుపునపుడు రసాయనసంయోగమువలన, గంధకధృతి గొట్టుబయలుదేరి, పొడుమంత

యు తడి యగును, దీనిని ఇనుప పెనములలో పెట్టి, సన్నటి సెగపై అరబెట్టిన చక్కగా వెలుగును. లేనియెడల నివ్వటుకో వకుండుటయు ఒకవేళ అంటుకొనినను వెంటనే ఆరిపోవుటయు తటస్థించును. ఇది తుపాకి మందుకన్న చులకనగా తయారు చేయదగి యుండుటను బట్టి తక్కువ ధరకు దొరకును.

2 ఆకుపచ్చ తెలుపురంగుగల మతాబులు:— 4 భా॥ గంధకము, 1 భాగము తగరపు బీడు, 3 భాగములు అంటిమొనీసల్ఫైడ్ (antimony sulphide), 1 భా॥ కఱ్ఱబొగ్గుపొడుము కలపవలెను.

3 గులాబీమతాబులు:—61 భా-క్లోరేటు అఫ్‌పొటాసియం (Chlorate Potassium) 16 భా - గంధకము 23 క్లోరెటు అఫ్ పొటాసియం (Chlorate of Potassium) తెచ్చి దంచి పొడుముచేసి కలుపవలెను.

4 నీలపుమతాబులు:—18 భా-క్లోరేటు అఫ్‌పొటాసియం (Chlorate of Potassium) 24 భా॥ సూరేకారం 14 భా॥ గంధకము, 6 భా॥ కూప్రిక్ ఆక్సైడ్ (Cupric oxide) కలుపవలెను.

5 ఆకుపచ్చ మతాబులు,—433 భా॥ పరిశుభ్రపరిచిన గంధకము 2250 భా॥ నైట్రేటు అఫ్ బేరియం (Nitrate of barium) 166 భా॥ క్లోరేట్ అఫ్ పొటాసియం 66 భా॥ ఆర్సనిక్, 100 భాగములు కఱ్ఱబొగ్గుతెచ్చి, దంచి పొడుముచేసి కలుపవలెను.

6 తెల్లకాకరపువ్వొత్తి— 32 భా॥ చక్కగదంచిన సూరేకారపుపొడి, 12 భా॥ చక్కగదంచిన గంధకపుపొడి, 8

భా॥ చక్కగదంచిన సోడి యుంపక్లోరైడ్ పొడి, 1 భా॥ మపాకమందు కలుపవలెను.

7 ఎఱ్ఱ కాకరపూవొత్తులు:—40 భా॥ నైట్రేట్ అఫ్‌స్ట్రానిటియం (Nitrate of stronteum) 10 భా॥ క్లోరేట్ పొటాష్, 5 భా॥ సోడియుంసల్ఫైడ్, తెచ్చి దంచి పొడుముచేసి కలుపవలెను.

8 ఆకుపచ్చ కాకరపూవొత్తులు:—30 భా॥ క్లోరేటు అఫ్ బేరియుం. 10 భా॥ బజారునందు దొరకు గంధకముపొడి (మైదాపిండంత మెత్తగానుండును) 1 భా॥ మాస్టిక్ కలుపవలెను.

9 నీలవర్ణపు కాకరపూవొత్తులు:— 20 భా॥ క్లోరేటుఅఫ్ పొటాసియుం, 11 భా॥ గంధకము, 14 భా॥ కూప్రిక్ ఆక్సైడ్, , భా॥ మాస్టిక్ తెచ్చిదంచి పొడుముచేసి కలుపవలెను

10. నీలవర్ణము, ఆకుపచ్చ రంగుగల కాకరపూవొత్తులు.—24 భాగములు నైట్రేటు అఫ్ బేరియం, 65భాగ క్లోరేటు అఫ్ పొటాసియమ్, భా॥,30 గంధకము 1 భాగము మాస్టిక్ తెచ్చి దంచి పొడుముచేసి కలుపవలెను.

11. తెల్లమతాబు వత్తులు.— 4 భా॥ సూరేకారము 1 భా॥ గంధకము, 1 భా॥ సోడియుం, సల్ఫైడు తెచ్చి దంచి పొడుము జేసి కలుపవలెను.

12. ఎర్రమతాబువొత్తులు.—?౦ భా॥ నైట్రేట్ ఆఫ్ స్ట్రాంటియం, 15 భా॥ క్లోరేటు ఆఫ్ పొటాసియం, 12 భా॥ గంధకముపొడి (బజారులో దొరుకునది) 2 భా॥ కర్రబొగ్గు, 2 భా॥ సోడియంలెక్ఫ్, 1 భా॥ మాల్ట్ తెచ్చి, దంచి పొడుముజేసి కలుపవలెను.

13 ఆకుపచ్చ మతాబువత్తులు.—20 భా॥ క్లోరేటు ఆఫ్ బేరియం, 30 భా॥ నైట్రేటు ఆఫ్ బేరియం, 10 భా॥ గంధకము కలుపవలెను.

14 నీలవర్ణపు మతాబువత్తులు.—18 భాగములు క్లోరేటు ఆఫ్ పొటాసియం, 6 భా॥ సూరేకారము, 10 భా॥ గంధకము ౦ భా॥ క్రూప్రిక్ ఆక్సైడ్, తెచ్చి దంచి పొడుము జేసి కలుపవలెను.

15 నీలవర్ణము ఆకుపచ్చరంగు గల మతాబువొత్తులు.—20 భా॥ క్లోరైడ్ ఆఫ్ బేరియం, 40 భా॥ క్లోరెటు ఆఫ్ పొటాసియం, 10 మొదలు 22 భా॥ గంధకము, సోడియం క్లోరెటు, తెచ్చి దంచి పొడుము జేసి కలుపవలెను.

16 ఫారోగారి పాము యందువంటి మరియొక విధమగు మందు.—ఇప్పుడు చెయ్యబోవు ప్రయత్నము మిక్కిలి ఆశ్చర్యకరము గానుండుటయేగాక కుతూహలముబుట్టించునదైనను, మందు కాల్చినప్పుడు, పాషాణగుణముగల పాదరసపు పొగవ్యాపిస్తా రమువచ్చును. అందువలన ఫారోగారిపాము అంత శ్లాఘ్యమై

నది కాదుగాన, దానికిమాఱుగ మరియొకవిధమును సూచించె దము.

"2 భా॥ క్లోరేటు ఆఫ్ పొటాసియం 1 భా॥ సూ కారము, 3 భా॥ తెల్లపంచదార (White sugar), తెచ్చి వేరువేరుగా పొడిగొట్టి, కలుపవలెను. వలయు ఆకారమునకు కాగితపు గొట్టములు జేసి, అందీ మందు కుక్కవలెను. ఇది బాగుగ ఆరిన పిదప, ఉపయోగించవచ్చును."

17. బంగారు కాకరపూవువత్తులు:—29 భా॥ క్లోరేటు ఆఫ్ పొటాషు, 30 భా॥ నైట్రేటు ఆఫ్ బాసిట (Nitrate o basita) 15 భా॥ అక్సొలేటు ఆఫ్ సోడా Oxolate of soda) 6 భా॥ గంధకము, 4 భా॥ షలెక్ (Shellac) కలుపవలెను. ఇందునుండివచ్చుపూవులకుతోక యుండునట్లుచేయుటకు వలచేమొదల 1 భా॥ చక్కగదంచిన కఱ్ఱబొగ్గుపొడిపయిదానికి కలుపవలెను. పిదప దీనిని షెలక్ సాల్యూషనుతో తడపవలెను. నీలవర్ణము గల అందమైన పూవులు, ఇవి కాల్చునపుడు బయలుదేరును.

దేశవాళి పటాకాయ.

తాటియాకులు తెచ్చి చీరి యీనె తీసివేసి, వానిని మూరెడు చొప్పున ముక్కలుగాచేసి, అందులో మందువేసి, టపాకాయవలె తోకయుంచి చుట్టి మూతిదగ్గర వత్తిపెట్టి బిగించవలెను వత్తికాల్చగానే సుర సుర లాడును. వెంటనే విసరి పారవేయవలెను. ఇది మంచి మోతమోగును.

## టపాకాయమందు.

### 1 వ విధము.

పాళ్ళు.

సూరేకారము 5. గంధకము 1. బొగ్గుపొడి 1. నీళ్లు1.

ముందుగా నొకకుండలో నీళ్లుపోసి పొయిమీద బెట్టి, నీళ్ళుకాగుచుండగా సూరేకారము వేయవలెను. సూరేకారము కరిగిన తరువాత, బొగ్గుపొడి వేయవలెను.గంధకము వేసి,కలియ బెట్టి దింపవలెను. తరువాత తీసి మెతగానూరి కొంచెముకొం చెము వేసి టపాకాయ కట్టవలెను. వత్తి, సన్నని కాకితము, చీపురుపుల్లకు చుట్టి, దానిని పిండి, అంటించి, చుట్టి, పూచికపుల్ల యూడదీసిన పిమ్మట, ఎండబెట్టి దానిని కత్తిరించి, అందులో నీమందుకూరి వత్తిగా వాడవలెను,

దూదిలో మందుచుట్టి, దానినే వత్తిగా వాడుచుందురు గాని, దీనికంటె పైన చెప్పిన ప్రకారముచేసిన కాకితపు వత్తియే ప్రశస్తము.

### టపాకాయ 2 వవిధము.

పాళ్లు.

సూరేకారము 4 పొటాషు 1 గంధకము 1

ఇవి దేనికది వేరు వేరుగా నూరి, పైపాళ్ళ వరుసనుకలిపి యీమందు పైన చెప్పఁబడిన ప్రకారముగా టపాకా

యలో వేసి కట్టవచ్చును. ప్రస్తుతమందీ పద్ధతియే వాడుకలో నున్నది. వత్తికిగూడ కాకితములో నీమందే వాడవలయును.

## ఇంగ్లీషు బాణసంచా

ఇంగ్లీషుపద్ధతిని బాణసంచచేయువారు తూనికలు సరిగా తూచుకొనవలయును. సరియైన వస్తువులు సంగ్రహించవలయును. ఇందులో వ్రాసిన ప్రకారముగా చేయవలయును.

1 ప్రేలుడు మందు.

ఇది బాణ సంచను కాల్చుటకు ప్రాణాధార మైనది. మనము చేయు ప్రతి బాణ సంచలో నీ మందు వాడవలెను.

ఇది 3 విధములుగా చేయవచ్చును.

1 వ విధము.

మీలుపవుడరు సన్ననిది వేసినవే నిప్పంటుకొనును.

2వ విధము.

మీలుపవుడరు (కాటుకవంటి బొగ్గుపొడి) 1 పాలు
బరకగానుండు బొగ్గుపొడి 1 పాలు

3వ విధము.

కాటుకవంటి బొగ్గుపొడి 3 పాళ్ళు
మామూలు బొగ్గుపొడి 1 పాలు
విధముగా నీ ప్రేలుడుమందు తయారు చేసికొనవలెను.

## II మంటపుట్టించు మందు.

| 1వ విధము. | 2 వ విధము. |
|---|---|
| బొగ్గు 1 పాలు | బొగ్గుపొడి 1 |
| కాటుకవంటి బొగ్గుపొడి 8 | కాటుకవంటి బొగ్గు16 |
| మెత్తని సన్నని తుపాకిమందు 4 | తుపాకిమందు సన్నము 8 |

3వ విధము.

బొగ్గుపొడి 1

కాటుకబొగ్గు పొడి 24

సన్నతుపాకి మందు 12

ఇందులో నేదియో ఒక విధము తయారుచేసి ఉంచుకోవలెను.

## 4 బాణసంచ వెలిగించు మందు.

| దినుసులు | 1 | 2 | 3 |
|---|---|---|---|
| బొగ్గు | 1 | 3 | 2 |
| మిరాలు పవుడరు (కాటుకవంటి మెత్తని బొగ్గు) | 8 | 16 | 12 |
| గంధకము | | 4 | 2 |
| నైటరు(సురేకారము) | | 6 | 8 |

ఇందులో మూడువిధములు చెప్పఁబడియున్నవి. వానిలోని నేదియైన వచేసికొని వాడుకోవచ్చును.

# 1. ముదురు పసుపు లేత పసుపు రంగునక్షత్రములు బాణములు

| దినుసులు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క్లోరేట్-పొటాషు | 8 | 4 | 12 | 16 | 12 | 16 | 4 | 4 | 16 | 8 | 8 | 16 | 16 | 4 | 8 | 6 | 20 | 5 | |
| ఆక్సలేటు-సోడా | 3 | 2 | 8 | 4 | 4 | | 3 | 1 | 4 | 4 | 4 | 5 | | 1 | | 4 | 15 | | |
| బైకార్బొనేటు-సోడా | | | | | | | | | | | | | 8 | | 8 | | | 1 | |
| నైట్రేటు-స్ట్రియొరైను | | | | | | | 20 | | | | 16 | | 4 | | | | | | |
| కార్బొనేటు-స్ట్రియొరైను | | | | 8 | 2 | 8 | | | | | | | | | | | | | |
| నైట్రేటు-బారిటస్ | | | | | | | | | 4 | 10 | | | 8 | | | 7 | 30 | | |
| సల్ఫరు-శుద్ధిచేసినది | | | | 4 | 4 | 4 | | 1 | 2 | | 6 | 5 | | | | 8 | 8 | 1 | 2 |
| షెల్లాకు-(కడ్డీలక్క) | 2 | 1 | 3 | | 1 | 1 | 5 | | 3 | 4 | 1 | | 4 | 1 | | 1 | 4 | | 1 |
| స్టియరైను | | | | | | 1 | | | 1 | | | | | | | | | | |
| బొగ్గు మెత్తనిది | | | | | | | | | | | 1 | 1 | | | | | 1 | | |
| లీలుగారు | | | | 1 | 1 | 1 | | | | | | | | | 1 | | | 1 | |
| పంచదారః (కుండ) | | | | | | | | | | | | | | 1 | 8 | | | | |

# Stars & Lances

## 3. నీలము వెన్నముద్దలు (నక్షత్రములు) బాణములు.

| దినుసులు ... ... | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క్లోరేటు ఆఫ్ పొటాష్ | 8 | 36 | 40 | 40 | 86 | 9 | 44 | 40 | 6 | 9 |
| కాలోమెల్ రసభస్మము | 4 | 18 | 24 | 24 | 12 | 8 | 12 | ... | 5 | 5 |
| లోవ్ షుగరు పంచదార. | 3 | 12 | 9 | 12 | 4 | 1 | 12 | 9 | 4 | 8 |
| సల్ఫరెట్టు ఆఫ్ కాపరు | 5 | 22 | 2 2 | 12 | 4 | 8 | 12 | 22 | ... | ... |
| స్టియరైను | ... | 1 | 1 | 1 | 3 | 1 | 1 | 2 | ... | .. |
| అమ్మక్లోరైడ్ ఆఫ్ కాపరు | ... | ... | ... | 3 | 4 | 2 | 5 | ... | ... | ... |
| సాల్ అమోనిక్ | ... | ... | ... | ... | ... | ... | ... | 6 | ... | ... |
| రాగిరజము | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 1 | ... |
| బ్లాక్ ఆక్సైడ్ ఆఫ్ కాపరు | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 2 |

రాగిసంబంధపు క్షారములతో పంచదారకంటె బాగా మిళితమగు వస్తువ లేదు.

పంచదార కలిసిన నీలపు మందు ముద్ద పాకమునకు వచ్చుటకు నీరుమాత్రమే కలుపవలెను. ఎందువల్లననగా పంచదారలోనే కావలసినంత నీరున్నదిగదా! కొంచెము నీళ్ళతో గలిపి ఎక్కువసేపు నూరిన మందులో బాగా కలియును.

# 3. రక్తవర్ణము నక్షత్రములు బాణములు.

| దినుసులు. ... ... | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క్లోరేటు–పొటాషు | 16 | 8 | 16 | 16 | 24 | 16 | 24 | 16 | 8 | 16 | 25 | 4 | 32 | 6 | 16 | 28 | 32 | 26 | 96 | 8 | 2 | 8 | 2 | 13 |
| నైట్రేటు–స్ట్రాంటియను | 16 | 16 | 32 | 32 | ... | 16 | 20 | 24 | 5 | 6 | 30 | 7 | 48 | 5 | | | 42 | 10 | 72 | 12 | 18 | 2 | 8 | 32 |
| గంధకము–శుద్ధిచేసినది | 5 | 6 | [illegible] | 12 | 6 | 5 | 10 | ... | 1 | ... | 10 | 1 | 6 | ... | | | 13 | 5 | 24 | 2 | | 2 | 2 | 8 |
| బొగ్గు–మెత్తనిది | 1 | 1 | 1 | 1 | 1 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | | | ... | | | | | | 1 | 2 |
| షెల్లాకు | ... | 1 | 4 | 2 | 2 | ... | ... | 7 | 1 | 4 | 3 | 1 | 12 | 1 | | | 4 | 3 | 21 | 4 | 5 | 3 | | |
| కాలు మెల్ (రసభస్మము) | ... | ... | 7 | ... | 6 | 1 | ... | 14 | 2 | 2 | 9 | 2 | 12 | 5 | | 12 | 12 | 10 | 42 | | | 4 | | |
| సల్ఫరెట్టు–కాపరు | ... | ... | 3 | 1 | ... | ... | ... | 1 | 1 | 1 | 3 | 1 | ... | 1 | | | 4 | 1 | 4 | 1 | 5 | | | |
| కీలుగారు | ... | ... | ... | ... | ... | 1 | 5 | 1 | ... | ... | ... | ... | ... | ... | | | ... | | | | 1 | | | |
| వెజటేబిల్లుబ్లాకు | ... | ... | ... | ... | | ... | ... | ... | ... | ... | 1 | ... | 1 | ... | | | 1 | | | | | 1 | | |
| గుండపంచదార | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 7 | 12 | | | | | | | | |
| కార్బొనేట్ స్ట్రాంటియం | ... | ... | ... | ... | 10 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 11 | 5 | | | | | | | | |

షెల్లాకు–(లక్క) ఇది పూర్వము పొడిచేయుట చాల కష్టముగానుండెను దీనిని ఉప్పుతో [illegible] పొడిచేసి, [illegible] నీళ్ళలో కలిపి, ఉప్పుతీసివేసి ఆరబెట్టుచుండువారు ఇప్పుడు పొడియే కావలసినంత దొరకును.

# 4 పచ్చనక్షత్రములు—బాణములు

| దినుసులు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 21 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క్లోరేటు-పొటాషు | 16 | 8 | 132 | 32 | 144 | 8 | 8 | 1 | | 16 | 6 | 12 | 16 | 8 | 48 | 22 | 24 | 108 | 24 | 16 | 2 | 18 |
| సై్రేటు-బారిటను | 16 | 8 | 108 | 64 | 160 | 21 | 2 | | | 8 | 7 | 5 | 8 | 8 | 42 | 22 | 32 | 108 | 32 | 48 | 10 | 32 |
| క్లోరేటు-బారిటను | | | | | | 8 | 2 | 2 | 4 | 8 | 8 | 4 | 4 | | | | | | | | | |
| కరిగిన గంధకము | 5 | 4 | 6 | 6 | 4 | 7 | 1 | 1 | 1 | 5 | | | 1 | | | | 10 | 18 | 8 | 12 | 2 | 8 |
| సన్నని బొగ్గు పొడి | 1 | 1 | | | | 1 | | | | 1 | | 1 | | | | | | | | 1 | 1 | 2 |
| సల్ఫరెట్టు ఆంటిమొని | | 1 | | | | | | | | | | | | | | | | | 2 | | | |
| కాలోమెల్ (రసభస్మము) | | | 48 | 27 | 100 | | | | | | 5 | 2 | 2 | 2 | | 10 | | 48 | | 8 | | |
| క్లిల్లాకు (లక్క) | | | 24 | 12 | 12 | 2 | | | | | | [illegible] | 4 | | 7 | 1 | | 24 | | 5 | | |
| పాజిటివిలు బ్లాకు (మసి) | | | 1 | 1 | | | | | | | | | | | | | | 1 | | | | |
| కుండపంచదార | | | | | | | | | | | 5 | | | 2 | 7 | 14 | | | | | | |
| పాలుఅకొనిక్ | | | | | | | | | | | | | | | | | | | | | | |
| రీలుగారు | | | | | | | | | | | | | | | 5 | | | | | | | |
| సల్ఫరెట్టు కావరు | | | | | | | | | | | | | | | | | 8 | | 8 | 2 | | |

